# రెండు కొరియాల మధ్య

## రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి



రొండు కొరియాల మధ్య 03 -02 -25

రొండో ప్రపంచ యుద్ధములో September 2, 1945.న జపాను అమెరికా మరియూ దాని మిత్ర దేశాలకు లొంగి పోయింది . అప్పట్లో రష్యా కూడా అమెరికా మిత్ర దేశమే . ఇక జపాను 1910 నుండి మొత్తము కొరియానూ తన వలస రాజ్యంగా చేసుకొని పాలిస్తూ వున్నది . బ్రిటన్ ఇండియాను పాలించినట్లుగా. దీని ఫలితంగా జపాను సేనలు మరియూ జపాన్ కు చెందిన సివిల్ ప్రజలూ మొత్తం కలిసి 7 లక్షల మంది వరకూ కొరియాలో నివాసం ఉండేవారు .

రొండో ప్రపంచయుద్ధములో జపాన్ ఓడి పోవటం వల్ల -- అప్పటి వరకూ జపాను వారి చేతుల్లో వున్నా కొరియా దేశాన్ని మిత్రకూటమి లోని అగ్ర దేశాలైన అమెరికా మరియూ రష్యా లు స్వాధీనం చేసుకున్నాయి . ఈ రోజుల్లో యుద్ధము గెలవటం అంటే ఏమిటంటే ? " ఓడి పోయిన దేశపు సైన్యము వద్ద వున్న ఆయుధాలు , బాంబులు, విమానాలు వంటి వాటిని గెలిచిన దేశము స్వాధీనం చేసుకుని వాటిని నిర్వీర్యం చేస్తుంది . ఆ పై ఆదేశానికి కావాల్సిన ఆయుధాలను - బాంబులను - విమానాలను తన దేశం నుండి వారికి అమ్ముతుంది .

- జపాను మూలకంగా కొరియా పై ఆధిపత్యం పొందిన అమెరికా రష్యాలు "మేము కొరియాని పంచుకుంటున్నాము" అనే మాట వాడకుండా , "కొరియా దేశము లో వున్న జపాను సైన్యమును , జపాను ప్రజలను ఆ దేశము నుండి ఖాళీ చేయించాల్సిన భాద్యత మాపై వున్నది* -అని చెపుతూ , కొరియాను రొండు ముక్కలుగా విభజించి, అందులో కొరియా సౌత్ అనే ముక్కలో వున్న జపాను సైన్యాన్ని ఖాళీ చేయించే భాద్యతను అమెరికా, కొరియా నార్త్ అనే ముక్కలో వున్న జపాను సైన్యాన్ని ఖాళీ చేయించే భాద్యతను రష్యా తీసుకుంటుంది అన్నారు .

పై భాద్యతలను నెరవేర్చటం కోసం , కొరియా దేశము కుండా పోతూ వున్నా 38 ప్యారెలెల్ అనే భూ సమాంతర రేఖ ఆధారంగా, కొరియాని సౌత్ మరియూ నార్త్ కొరియా అనే రొండు భూ భాగాలుగా విడదీశారు . ఒక నౌరకాయను రొండుముక్కల కింద మార్చినట్లు గా. సౌత్ కొరియా నుండి జపాను సైన్యాన్ని తొలగించి వారిని వెనక్కు పంపే పని అమెరికా , నార్త్ కొరియా నుండి జపాను సైన్యాన్ని తొలగించి వారిని వెనక్కు

పంపే పని రష్యా చేపట్టాయి . రొండు కొరియాల నుండీ జపాను సైన్యమును తొలగించే పని సెప్టెంబర్ 1945, లో మొదలైంది. ఇట్లగా నార్త్ కొరియా మీద రష్యా వారి ప్రభావము , సౌత్ కొరియా మీద అమెరికా వారి ప్రభావము పడటం మొదలైంది . ఈ ప్రభావాలకు అనుగుణంగా నే ఆ దేశపు రాజకీయ భావజాలాలు కూడా వృద్ధి చెందాయి .

. ఇరు దేశాలకు జపాను సైనాన్ని కొరియానుండి పంపించి వేయటం ని అనుకున్నంత తేలిక పని కాలేదు .కారణం జపాను మిలిటరీ వారు వారు కొరియా లో వున్నపుడు - కొరియాలో వున్న జాపనీస్ కుటుంబపు అమ్మాయిలను లేదా కొరియా అమ్మాయిలను పెళ్లాడే వారు . వీరికి పిల్లలు కలిగి నపుడు వారు జపాను వారి పిల్లలు గా గుర్తింప పడ్డారు . జపాను సైనికులు - కొరియాలో తమకు పెండ్లాము పిల్లలు ఏర్పడినాకా వారికోసమని ఇండ్లూ , ఆస్తులూ పొలాలు వంటివి కూడా సమకూర్చుకున్నారు . ఇది కాక ఒక్కో సారి జపాను సైనికులకు బంగారపు నిధులు కూడా దొరికేవి. . స్వదేశం పోతే వాటిని ఎక్కడ వదులుకోవాల్సి వస్తుందో అనే భయం కూడా వీరికుండేది .
ఇహ జపాను లొంగి పోయే నాటికి, ఈ {జపాను} సైనికుల వద్ద మిలటరీ ఆయుధాలే కాకుండా ఇంకా వాడకుండా వున్న బాంబులు- రాకెట్ లాంచర్లు వంటివి అనేకం ఉండిపోయాయి . సైనికులు ఈ ఆయుధాలను తిరిగి ఇవ్వటానికి కూడా ఇష్టపడలేదు .వాటిని తమతోటే తీసుకు వెళ్లి ఎక్కడెక్కడో దాక్కున్నారు . తమ కుటుంబాన్ని కొరియాలో వదిలి పెట్టి జపాను వెళ్లి పోతే తిరిగి వారిని చూస్తామో లేదో అనే ఆలోచనవల్ల కూడా వారు కొరియాని వదిలి పెట్టి పోవటానికి ఇస్టపడలేదు . ఇష్టపడక కొరియాలోని మారు మూల పల్లెలకు పోయి అక్కడ దాక్కుని - వ్యవసాయం చేసుకుంటూ బ్రతక సాగారు . కొరియాలోని మారు మూలలలోకి వెళ్లిన జపాను మిలిటరీ సైనికులను వెతికి పట్టుకోని , వారి వద్ద వున్న ఆయుధాలన్నీ స్వాధీనం చేసుకొని, వాటిని నిర్వీర్యం చేసి వారిని జపాను కు పంపి వేయటం రష్యా మరియూ అమెరికా దేశాలకు ఊహించిన దానికి మించిన భాద్యత అయింది . ఈ భాద్యతలు నిర్వహించే క్రమంలో అమెరికా రష్యాలు తమకు దక్కిన కొరియా ప్రాంతాలలోని పల్లె పల్లెకూ తిరిగి ఆ ప్రాంతాలపై తమ పట్టు పెంచుకున్నాయి .దీనితో పాటు తమ క్యాపిటలిస్ట్ - కమ్యూనిస్టు భావజాలాన్ని పల్లె పల్లె లోకి ప్రవేశపెట్టాయి . పైన చెప్పినట్లు జపాన్ సైనికులు కొరియాలో కలిసి పోయినందున - కొరియాలో వున్న జపాన్ వారు మామూలు సివిల్ జనమా ? మిలటరీ జనమా ? మిలటరీ అయన కుంటుంబము మిలటరీ కుటుంబము అవుతుంది కాబట్టి - అప్పుడు మొత్తము కుటుంబాన్ని జపానుకు పంపాలా ? పంపితే ఎట్లా పంపాలి ? అన్న చిక్కులు కూడా ఎదురయ్యాయి . అట్లాగా ఈ లొంగు బాటు ప్రక్రియ అతి త్వరగా పూర్తి కానిదిగా నూ , సంవత్సరాల

పాటు పట్టేదిగా నూ మారింది. .ఇట్లా -- ఈ "సైనిక లొంగుబాటు" అనే ప్రక్రియ కొనసాగించటం అనే పేరుతో అమెరికా రష్యాలు కొరియాలో తమకు తృప్తి వచ్చినంత కాలం ఉండటానికి అవకాశం దొరికింది .ఇహ కొరియాలోకి వలసలు వచ్చిన చైనా వారు కూడా వుంటారు. జపాను - కొరియా- చైనా- వారి మొఖాలు అన్నీ ఒకేరకంగా కనపడటం వల్ల ఈ ప్రక్రియ అమెరికా రష్యాలకు మరింత సవాలుగా మారింది .
ఇహ జపాను ఒడి పోయింది కదా ? - అందువల్ల అది కొరియా ఎక్కడెక్కడో వున్న తన దేశపు మిలటరీ జవానులు నిర్వీర్యము చేయ బడ్డ ఆయుధాలతో సహా తన దేశము నకు తిరిగి వచ్చారో లేదో లెక్క చూసు కుని , ఆ లెక్కని అమెరికా,రష్యా లకు సమర్పించుకోవాల్సి వచ్చింది . ఇట్లా చూసినపుడు " నా సైనికులు ఎవరూ కొరియాలో లేరు " అని జపాను రుజువు పరిచేంత వరకూ అమెరికా రష్యాలకు కొరియాలో ఉండటానికి ఒక కారణం దొరికి నట్లయింది . కొరియా కూడా యుద్ధము లో ఒడి పోయిన దేశంగా లెక్క వేయబడినందున అది స్వంతంగా ఆయుధాలు తయారు చేసుకునే హక్కును కోల్పోయింది . దీని వల్ల, జపానుకు, కొరియాకి కావాల్సిన ఆయుధాలు అమ్ము కోవటానికి అమెరికాకి, రష్యాకి మార్కెట్ పెరిగింది . ఇదే యుద్ధములో గెలిచిన వారికి దక్కే బహుమతి . అందువల్ల ఏదేశమూ కూడా వెనక్కు తగ్గకుండా -కొరియా పై పట్టు నిలబెట్టుకుంటూ వచ్చాయి .

జపాను సైనికులను కొరియానుండి తొలగించటం అనేది సుదీర్ఘ ప్రక్రియగా మారటంతో - 1948, లో రెండు కొరియా ముక్కలనూ రెండు దేశాలుగా మారుద్దాము అని అమెరికా రష్యాలు అన్నాయి . నార్త్ కొరియా అనే భూ భాగము "ది డెమోక్రాటిక్ పీపుల్స్ రిపబ్లిక్ అఫ్ కొరియా(DPRK)" అనే దేశంగానూ -- సౌత్ కొరియా అనే భూ భాగము " ది రిపబ్లిక్ అఫ్ కొరియా " (ROK). " అనే అనే దేశంగానూ మారాయి.

రచన సేకరణ వివరణ వారాణసి ఉమా శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి .
దీని తదుపరి భాగము వున్నది

రెండు కొరియాల మధ్య 04 -02 -25 rkkr2

1945 లో రెండు భూ భాగాలుగా విభజించ బడిన కొరియా, 1948 లో నార్త్ కొరియా మరియూ సౌత్ కొరియా అనే రెండు దేశాలుగా మారాయి అని చెప్పుకున్నాము కదా ? నార్త్ కొరియా తన చేతులలోకి రాగానే రష్యా అక్కడ కమ్యూనిస్టుల పాలన నెలకొల్పింది .అంటే ఎటువంటి మిలటరీ అధికారం చెలాయించకుండా - రష్యన్ కమ్యూ

నిస్ట్ సిద్ధాంతాలకు అనుగుణంగా కొరియాను పరిపాలించే వారికి అధికారం అప్పగించింది . ఈ నార్త్ కొరియాకి రష్యా మిలిటరీ అండదండలు ఉంటాయి కానీ - దేశంలో రష్యా మిలిటరీ ఉండదు .
ఇక సౌత్ కొరియాలో -- అమెరికా తన మిలిటరీ పాలన నెలకొల్పింది .అంటే సౌత్ కొరియాలో అమెరికా మిలిటరీ ప్రత్యక్షంగా ఉంటుంది . ఈ మిలిటరీ పెద్దలు చెప్పినట్లు వినే ప్రజా నాయకులు దేశాన్ని ఏలుతారు .

రెండు దేశాలుగా విడి పోయిన తమ దేశము తిరిగి ఏకం కావాలని కోరుకోని కొరియన్ ఉండడు కదా ? అందువల్ల రెండు దేశాలను కలిపి ఒకే దేశము గా చేయాలన్న ఆందోళనలు రెండు దేశాలలోనూ జరుగుతూ ఉండేవి . 1948, లో అమెరికా, యునైటెడ్ నేషన్స్ వద్దకు వెళ్లి రెండు కొరియాలను ఒక్కటిగా గుర్తించి అందులో ప్రజాస్వామిక ఎన్నికలు జరపాలని - కోరింది . అప్పుడు రష్యా ఈ ఎన్నికలకు సరే అన్నది . సరే నంటూ నే , "ఎన్నికలు అంటే ఇద్దరో ముగ్గురో నాలుగురో పోటీకి నిలుచుంటే అందులో ఒకరిని ఎన్నుకోవటమే కదా ప్రజాస్వామ్యము అంటే ? కాబట్టి రష్యా ఏ పోటీకి నిలవబడే వారి పేర్లను ఎంపిక చేసి ప్రకటిస్తుంది . అలాంటి ప్రజాస్వామ్యము సాధిద్దాము " అన్నది . ఈ రకంగా చేసినపుడు రష్యా- కేవలం కమ్యూనిస్ట్ నాయకులను మాత్రమే ఎన్నికల బరిలో దింపే అవకాశాలు మెండు గా ఉండటం తో --తాను ప్రతిపాదించిన ఎన్నికలను అమెరికానే వ్యతిరేకించింది . ఈ జరగని ఎలెక్షన్ల మూలంగా - సౌత్ కొరియా లో పాగా వేయటానికి నార్త్ కొరియా యత్నించినట్లు గానూ - మొత్తము కొరియాను తన గుప్పిట లోకి తెచ్చుకోవటానికి అమెరికా ప్రయత్నించినట్లుగాను అయ్యింది.

ఇటు తరువాత "మొత్తము రెండు కొరియా ల లోనూ ప్రజాస్వామ్య ఎన్నికలే జరగాలి-ఆ ఎన్నికలలో ఎవరైనా సరే పోటీకి నిలబడ అవకాశం ఉండాలి " అని డిమాండ్ చేస్తూ "ది రిపబ్లిక్ అఫ్ కొరియా (ROK)" అనే పార్టీ 15, 1948 న స్థాపించ బడింది . ఈ పార్టీ అమెరికా యొక్క సృష్టి. దీని ఉద్దేశ్యము అమెరికాకు అనుకూలంగా పని చేయటం . అమెరికా కోరుకునే రీతిలో ఎలక్షన్స్ జరపాలని రష్యాను డిమాండ్ చేయటం దీని పని. దీని అధ్యక్షుని పేరు "సైన్గ్మన్ రహీ" ."Syngman రహీ" "సైన్గ్మన్ రహీ"అంటే జపాను వారు కొరియా దేశములో వున్నపుడు వారిని వ్యతిరేకించి - కొరియాకి స్వాతంత్రము ఇవ్వండి అని పోరాటం జరిపిన పెద్దాయన. సౌత్ కొరియా తన చేతులలో పడినాక- July 20, 1948: న అమెరికా ఈయనను సౌత్ కొరియాకి అధ్యక్షుడు ని చేసింది . అమెరికాయే ఈ పెద్దాయన చేత (ROK)" అనే

పార్టీ పెట్టించింది అనీ -మరి ఇతర విధాలుగా ఈ పార్టీని విమర్శించటంద్వారా చైనా బహిరంగంగా- అమెరికా పై తనకు గల శత్రుత్వాన్ని చాటుకున్నది .అటూ ఇటూ చూసి చైనా కూడా కొరియాలో జోక్యానికి దిగినట్లయింది. పెద్దాయన . 1948 నుండీ 1960 వరకూ సౌత్ కొరియాకు అధ్యక్షుడు గా వున్నారు .

ఈ నేపధ్యములో June 25, 1950, నార్త్ కొరియా వెళ్లి సౌత్ సౌత్ కొరియా మీద మిలిటరీ దాడి చేసింది . నార్త్ కొరియా సైనికులే దాడి జరిపారు కానీ ఇందులో రష్యా మిలిటరీ వారు లేరు అని గమనించాలి . నార్త్ కొరియా సౌత్ కొరియా మీద దాడి చేయటము అంటే-- అది తన కమ్యూనిస్టురాజ్యాన్ని సౌత్ కొరియాలోకి విస్తరించాలన్న ఉద్దేశ్యము అయివుంటుంది కదా ? అని భయపడి న అమెరికా అందుకు తగ్గట్లు స్పందించింది .అంటే కొరియా యుద్ధము అనేది మొదలైంది. ఇప్పుడు చూస్తే సౌత్ కొరియా తరఫున అమెరికా నార్త్ కొరియా పై యుద్ధానికి దిగింది . మరి నార్త్ కొరియా తరఫున రష్యా వచ్చి అమెరికాని ఎదుర్కొంటే ఏమవుతుంది ? అది మూడో ప్రపంచ యుద్ధము అవుతుంది - అని , అమెరికా మరియూ రష్యాల వద్ద అణ్వాయుధాలు వున్నాయి కాబట్టి -ఈ భూమి భస్మ అయిపోతుందని ప్రతి ఒక్కరు చివరి రోజులు లెక్క వేసుకో సాగరు . ఈ మూడో ప్రపంచ యుద్ధము తప్పి పోయిందని మాకు చెరిత్ర భోదించే ఉపాధ్యాయుడు చెప్పి సంబర పడటం నాకు ఇంకా గుర్తుంది .

ఎందువల్లనో ఏమో కానీ - రష్యా నేరుగా రంగం లో వున్నా చోటికి అమెరికా సేనలు పోవు . దీనికి ఉదాహరణ - యుక్రేన్ యుద్ధము . అమెరికా సేనలు నేరుగా రంగము లో వున్నా చోటికి రష్యా సేనలు పోవు . వారు ఇదే పద్ధతి పాటిస్తూ ఉన్నంత కాలము మనకు మూడో ప్రపంచ యుద్ధము లేనట్లే .

దీనికి ముందు భాగాన్ని ఇదే ఫేస్బుక్కు లో rkkr1 అని - దీని తరువాతి భాగాన్ని rkkr3 అని సెర్చ్ చేయటం ద్వారా చదవవచ్చు .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

రొండు కొరియాల మధ్య 05 - -02 -25 rkkr3
}

ఇక నార్త్ కొరియా వైపు నుండి సౌత్ కొరియా పై జరిగిన మిలటరీ దాడికి భాద్యుడైన వ్యక్తి పేరు " "ఇల్ సుంగ్" . ఇతని ఇంటి పేరు "కిమ్" . మొత్తము కలిసి ఇతని పేరును "కిమ్ఇల్ సుంగ్ " అని పలుకుతారు . "కిమ్" అనేది కొరియన్ ఇంటిపేరు - అనేక మందికి ఉంటుంది .

ప్రస్తుతానికి నార్త్ కొరియాకు అధ్యక్షుడిగా ఉన్నవారి పేరు Kim Jong Un . వీరు అధికారంలోకి ఎలావచ్చారో చెప్పవలసినది అని ఒక సోదరి అడిగారు . అందుకని వివరంగా చెపుతూ వున్నాను . డిసెంబర్ 2011 లో "కిమ్ Jong Un "నార్త్ కొరియాకు అధిపతి అయినాడు . అంతకు ముందు ఈయన తండ్రి "Kim Jong-ఇల్" నార్త్ కొరియాకు అధిపతి . "కిమ్ Jong-ఇల్"17 December 2011 న మరణించగా-- తండ్రి నుండి ఒక వారసత్వంగా " Kim Jong Un" ఆ పదవి చేపట్టారు . ఇహ "కిమ్ Jong-ఇల్"కు ఆపదవి ఎక్కడనుండి వచ్చిందీ ? అంటే -- అయన తండ్రి ఐన ""Kim Il-Sung-సుంగ్" నుండి వచ్చింది.
. ఇహ "Kim Il-Sung నార్త్ కొరియా యొక్క అధికారపీఠాన్ని ఎలా ఎక్కాడు అంటే - ఈయన "వర్కర్స్ ' పార్టీ అఫ్ కొరియా (WPK)" అనే కార్మిక సంఘాన్ని స్థాపించి అందులోనుండి ఎదిగి నార్త్ కొరియా కి అధిపతి అయినాడు . అయ్యిన క్రమమేమిటి ? అంటే - కొరియాను పంచుకున్నపుడు నార్త్ కొరియా రష్యా వారి చేతుల్లోకి పోయిందికదా ? అందువలన రష్యా వారు నార్త్ కొరియాలో "ది కమ్యూనిస్ట్ పార్టీ అఫ్ కొరియా" అనే కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు. .ఇప్పటికే కొరియాలో వున్న "వర్కర్స్ ' పార్టీ అఫ్ కొరియా (WPK)" అనే కార్మిక సంఘానికి అధ్యక్షుడిగా వున్న "Kim Il-Sung "ను తీసుకొచ్చి - కొరియా కమ్యూనిస్టు పార్టీకి నాయకునిగా చేసి - అయన చేతికి ప్రభుత్వాన్ని అప్ప చెప్పారు . ఇట్లా నార్త్ కొరియాలో కమ్యూనిస్టు పాలన ఆరంభము ఐంది . ఇంకా తొలుచుకుంటూ పోతే-- కొరియా కమ్యూనిస్ట్ పార్టీకి అసలు నాయకుని పేరు "Cho Man-sik "చొ మం -సింక్" . ఇతడు కొరియా దేశానికి సంభందించిన విషయాలలో యునైటెడ్ నేషన్స్ " జోక్యం చేసుకోకుండా చూడమని రష్యాని వేధిస్తూ ఉండేవాడు . ఈ వేధింపులు భరించలేని రష్యా ఈయనను కొరియా కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షునిగా తప్పించి - "కిమ్ ఇల్ సుంగ్ " కమ్యూనిస్ట్ పార్టీ అధ్యక్షునిగానూ - దేశపు ప్రెసిడెంట్ గానూ చేసింది . ""Kim Il-Sungకిమ్ ఇల్ సుంగ్ " కొరియా దేశపు వ్యవహారాల్లో యునైటెడ్ నేషన్స్ జోక్యం చేసుకుంటే మాకేం ఫరవా లేదు " అనే ధోరణి అవలంభిస్తాడు. రష్యా వారు కూడా ఇదే ధోరణి అవలంభిస్తారు. . అందువలన-పైన చెప్పిన తాత - తండ్రీ - కొడుకులకు రష్యా వారి ఆశీర్వాదాలు కొనసాగుతూ ఉంటాయి . "Cho Man-sik " కొన్నాళ్ల పాటు కిమ్ వంశస్తులని

విమర్శించి - కొరియా యొక్క ప్రముఖ నాయకునిగా ముద్ర వేయించుకొని రాజకీయాలనుండి కనుమరుగై పోయాడు . ఇట్లాగా కిమ్ వంశస్తులు నార్త్ కొరియాను ఎలాటం తమ వంశ పారంపర్య హక్కులాగా - భావిస్తూ నియంతృత్వ పోకడలతో నార్త్ కోరియాను ఏలుతూ వుంటారు . వీరు నార్త్ కొరియాకే కాక, ఇందాక మనము చెప్పుకున్న వర్కర్స్ పార్టీ అఫ్ కొరియాకు కూడా వంశపారంపర్య అధ్యక్షులుగా ఉంటూ వున్నారు . వీరి నియంతృత్వ ధోరణి ని కట్టడి చేయటానికి అని " కొమ్యూనిస్టు పార్టీ అఫ్ కొరియా " తమ పార్టీ ఆఫీసులో అయన మీద ఏవో అవిశ్వాస తీర్మానాలు వంటివి చేస్తూ ఉంటుంది . దీనిని ఎవరూ లెక్క చేయరు . కానీ "కిమ్ "లకు ఒక వ్యతిరేక వర్గము వున్నది అని మాత్రం ప్రపంచానికి వెల్లడి అవుతూ ఉంటుంది.

Kim Jong Un యొక్క భార్య పేరు Ri Sol-జు.ఈమె పుట్టు పూవోత్తరాలు అన్నీ ప్రభుత్వ రహస్యాలు అన్న విభాగం లో చేర్చారు . 2012 లో ఈమె ఎవరికీ కనపడకుండా ఎక్కడికో పోయి - కుమార్తెను కని అందరికీ తెచ్చి చూపింది .వీరి కుమార్తె పేరు "Kim Ju ఏ" . ఈమె తన తడ్రినుండి ఒక వారసత్వంగా "నార్త్ కొరియా అధ్యక్షురాలు" అనే పదవిని ఈమె అందుకో బోతూ వున్నదని అంచనాలు వేస్తూ - అమెరికా ఈ పిల్ల కదలికలపై ఓ కన్ను వేసి ఉంచుతూ ఉంటుంది . ఈ పిల్ల ఇప్పటి వయసు ఎంతో అనేది కూడా ప్రభుత్వ రహస్యాలు అనే విభాగాల్లో చేర్చారు . 2012 లో ఈమె తల్లి ఆజ్ఞత వశంలోకి వెళ్ళటం తో అది ఆమె గర్భిణీగా వున్న కాలమని - అందువల్ల ఈ వయసు నేటికీ 12 అని అమెరికా అని అంచనా వేసింది . ఇక ఏ దేశంలో నైనా 18 దాటక పోతే అది మైనారిటీ పెళ్లినట్లు కాదు . వీరు ప్రభుత్వ పదవులకు అనర్హులు అవుతారు . "Kim Jong UN" అకస్మాత్తుగా చని పోతే ఎలా అనే ఆలోచనతో - ఈమె పుట్టిన తేదీకి - ఆమె తల్లి గర్భము లో వున్న తొమ్మిది నెలలో లేదా ఫది నెలలో కలిపి ఈ పిల్ల వయసు త్వరగా 18 కి చేరేట్లు చేయాలని -ఆమె తండ్రీ నార్త్ కొరియా అధ్యక్షుడు అయినా "Kim Jong UN" ప్రయత్నిస్తూ వున్నాడు .

ఇప్పుడు ఇక మామూలు విషయాలకి వద్దాము .

. Kim Il-Sungకిమ్ ఇల్ సుంగ్ " వర్కర్స్ ' పార్టీ అఫ్ కొరియా (WPK) అనే సంస్థకు 1949 నుండి చైర్మన్ గాఉండి అక్కడనుండి నార్త్ కొరియాకి ప్రీమియర్ / ప్రెసిడెంట్ అయినాడు . ఈయనకు రొండు కొరియాలను కలిపి ఒక్కటి గా చేయాలనే కోరిక ఉండేది .ఆ కోరిక తో ఈయన ఇచ్చిన అనుమతితో నార్త్ కొరియాకి చెందిన

సైన్యము సౌత్ కొరియా పై దాడికి వెళ్ళింది .దీనికి స్పందనగా  సౌత్ కొరియా తరఫున అమెరికా రంగం లోకి దిగింది .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

రెండు కొరియాల మధ్య   06 -02 -25     RKKR4

నార్త్ కొరియా ముందుగా దాడికి దిగటం వల్ల 25 June 1950  న కొరియా యుద్ధము మొదలైంది .ఈ  యుద్ధములో "మేము  నెగ్గు తాము "   అన్న నమ్మకం యుద్ధము చేసే వారి లో ఎవరికీ లేదు . అందువల్ల అమెరికా రష్యాల మధ్య July 27, 1953  న "ది  కొరియన్  ఆర్మీస్టిస్"    అగ్రిమెంట్  అనేది జరిగింది .  ఆర్మీస్టిస్  అగ్రిమెంట్ అంటే - ఇక నుండీ యుద్ధము మాని శాంతముగా ఉందాము " అనే ఒప్పందం కాదు . " మనము ఇరువురమూ యుద్ధము చేసీ చేసీ అలసి పోయాము - ఇప్పటికి ఈ యుద్ధము ఆపుకుందాము .తిరిగి మనం యుద్ధము ప్రారంభించే లోగా ,  మన దేశపు నాయకులు బల్లల ముందు కూచుండి - ఈ యుద్దానికి బదులు మరొక మార్గం ఏదన్నా కనిపెడతారేమో చూద్దాము " అనే పరస్పర అవగాహన ఒప్పందం , {ఇలాంటి ఒప్పందాలు శాంతిని నెలకొల్పటానికి ఉపయోగిస్తాయి అనుకుంటాము కానీ అది నిజం కాదు .
ఇలాంటి అగ్రిమెంట్ ల తరువాత రాజకీయనాయకులు - ప్రజల మనో భావాలను మరింత రెచ్చకొట్టుతూ తమ  పాప్యులారిటీని మరింత పెంచుకోవటానికి కృషి చేసుకుంటారు }.

ఈ ఒప్పందాన్ని గురించి అప్పటి అమెరికా  ప్రెసిడెంట్  " ఇప్పుడు ప్రపంచము లోనికి శాంతిని తీసుకురావటం కోసం -   బాంబుల తెలివిని కూడా వాడే అవకాశం లభించింది "అన్నాడు .
రెండు కొరియా ల లోని ప్రజలు ఈ ఒప్పందాన్ని స్వాగతించ లేదు . "యుద్ధము చేయండి లేదా తెలివితో ఆలోచించండి - కానీ ఎదో ఒకటి చేసి రెండు కొరియాలను ఏకం చేయండి "అన్నారు  .
అమెరికా వ్యూహకర్తలు " నార్త్ కొరియా ఈ అగ్రిమెంట్ ను అతిక్రమించిన మరు క్షణములో యుద్ధము మొదలవుతుంది"  అనే నిబంధన ఇందులో లేదు ఏమిటి?  అని అడిగారు .  అంటే అమెరికా రష్యాకు దడిచినట్లా ?

చైనా దేశము జోక్యం చేసుకొని " ఇలాంటి ఒప్పందం కాకుండా మరొకటి -- అంటే జానీవా ఒప్పందం పెడదాము " అన్నది . మామూలు ఒప్పందం అనేది అగ్రిమెంట్ చేసుకున్న రెండు దేశాలకే చెందుతుంది . కానీ జానీవా అగ్రిమెంట్ అంటే - రెండు దేశాల మధ్య యుద్ధము మూలంగా నష్టపోయిన మరొక దేశము - లేదా ప్రపంచము లోని ఏ దేశమైనా కూడా ఈ ఎగ్రిమెంట్ కిందకు వచ్చి - యుద్ధ నష్టపరిహారాలు కోరటానికి వీలుంటుంది . రుష్యా " సౌత్ కొరియా ప్రతి పాదించిన ఈ ఒప్పందం నమ్మ తగ్గట్లుగా వున్నది" అన్నది మొత్తము మీద కొరియా యుద్ధములో బ్రిటిష్ సైనికులు 1,100 మంది చనిపోగా 2,600 మంది గాయపడ్డారు .
అమెరికా సైనికులు 37,000 మంది చనిపోగా 92,000 మంది గాయ పడ్డారు. సౌత్ కొరియా సైనికులు ఓ అరలక్ష మంది చనిపోయారు . దీన్ని చూస్తే శాంతికోసం యుద్ధాన్ని బదులు తెలివిని వాడే అవకాశం వచ్చిందని అమెరికా ఎందుకు అన్నదో తెలుస్తుంది. ఇంతే కాక మన శత్రువుకు నష్టము మనకు లాభము కాదని , మనకు జరిగిన నష్టానికి మరొకరు దుఃఖించబు అని కూడా అమెరికా తెలుసుకుంది .

ఈ యుద్ధములో రష్యా సైనికులు ఆరు నుండి పదకొండు లక్షలు మరణించారని అమెరికా అన్నది . .దీనికి కారణము రష్యా తన నష్టాలను బయట పెట్టక పోవటమే . చైనా సైనికులు ఒక లక్షా ఎనుబది వేలు దాటి మరణించారు అని అమెరికా అంచనా .

చివరికి July 27, 1953, న యునైటెడ్ స్టేట్స్ , నార్త్ కొరియా , సౌత్ కొరియా , చైనా , ది సోవియెట్ యూనియన్ అఫ్ రష్యా లు , ఒక ఒప్పందం మీద సంతకాలు చేశాయి . ఈ అగ్రిమెంట్ ప్రకారం కొరియాను రెండు ప్రాంతాలుగా విభజిస్తూ వున్నా సరి హద్దు రేఖ పక్కనే - మిలటరీ వారి కోసం మరొక లైన్ గీస్తారు .ఆగీతను ఏ దేశపు మిలటరీ వారూ అతిక్ర మించకూడదు . దేశపు సరి హద్దులను కాదని మరొక గీత ఎందుకు గీశారు అంటే - యుద్ధము జరుగుతూ వున్నపుడు ఎవరు ఎక్కడ ఆగి పోయి యుద్ధ విరమణ చేశారో చూపేందుకు వీలుగా ఈ గీత గీశారు . ఒక వేళ యుద్ధము కనుక తిరిగి కొనసాగితే ఆ గీత దెగ్గరణయించే మొదలు అవుతుంది లేదా మొదలవ్వాలి అని .ఈ గీతకు అర్ధము .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

రెండు కొరియాల మధ్య 07 -02 -25 RKKR5

కొరియా యుద్ధములో బ్రిటిష్ సైనికులు 1,100 మంది చనిపోగా 2,600 మంది గాయపడ్డారు , అని చెప్పుకున్నాము . మధ్యలో వీరెక్కడనుండి వచ్చారా? అని ఎవరో ఒకరికి అనుమానం వచ్చే ఉండవచ్చు . అది ఇలా జరిగింది .
25 June 1950 న కొరియా యుద్ధము మొదలైంది . అప్పుడు అమెరికా వారి ప్రోద్బలం తో యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ ముందుకు వచ్చి " నార్త్ కొరియా మరియూ దాని మిత్రుడు రష్యా
యొక్క ధోరణి చాలా పెడసరంగా వున్నది " అంటూ తీర్మానించి - July 7, 1950 న " ది యునైటెడ్ నేషన్స్ కమాండ్ (UNC), అనేదాన్ని స్థాపిస్తునట్లు ప్రకటించింది .ఈ రకంగా - అమెరికా - నార్త్ కొరియా మరియూ పరోక్షంగా రష్యా పై యుద్ధము చేయటానికి ఒక కూటమిని ఏర్పాటు చేసుకుంది . దీనిలో అమెరికా తో పాటు .ఆస్ట్రేలియా , బెల్జియం , కెనడా , ఫ్రాన్స్ , జర్మనీ , గ్రీస్ , ఇటలీ , యునైటెడ్ కింగ్డమ్ , వున్నాయి . అందువలన అమెరికాతో పాటు ఈ దేశాల సైనికులు కూడా కొరియా యుద్ధము లో పాల్గొన్నారు .అందువల్ల బ్రిటిష్ సైనికులు చనిపోవటం జరిగింది .ఇదేరకంగా బ్రిటన్ సైనికులే కాకా ఇతర దేశపు సైనికులు కూడా మరణించారు . అనవసరము అని నేను ఆ వివరాలు ఇవ్వలేదు .

(UNC), లో జెర్మనీ సైన్యము కూడా వుండటము మనము గుర్తింప తగ్గది .రెండోవ ప్రపంచ యుద్ధము పర్యవసానంగా - జర్మనీ రెండుగా విభజింప బడి - వెస్ట్ జెర్మనీపేరుతో ఓ ముక్క అమెరికా చేతిలోనూ - ఈస్ట్ జర్మనీ పేరు మీద ఓ ముక్క రష్యా చేతిలో వున్నది . .జెర్మనీ ఏ రెండో ప్రపంచ యుద్ధమును ప్రేరేపించి ప్రపంచములో అశాంతి ని రేపింది కాబట్టి - దానికి పరిహారంగా లేదా ఆ పాప ప్రక్షాళనకు గాను -- ప్రపంచములో శాంతిని నెలకొల్పి దానిని పరి రక్షింపవలసిన కర్తవ్యము జెర్మనీకీ వున్నదని భోదించి-- జర్మనీని ఈ యుద్ధములోకి తీసుకొచ్చారు . అయితే జర్మనీ తరఫున మిలటరీ సైనికులు కాకుండా సైనికులకు వైద్య సాయము అందించే మిలిటరీ దళాన్ని {మిలిటరీ డాక్టర్లు నర్సులు వంటివారిని }ఈ (UNC) లోకి తెచ్చారు .ఈ (UNC) ఈ నాటికీ అలాగే వున్నది. .ఈ (UNC) చేసిన నిర్ణయాలను అమలు పరుస్తూ యుద్ధము చేసే భాద్యత ను US కంబైన్డ్ ఫోర్సెస్ కమాండ్ (UFC)అనే పేరున అమెరికాయే తన చేతుల్లోకి తీసుకుంది . ఇహ ఈ (UNC)యునైటెడ్ నేషన్స్ కమాండ్ కు వ్యతి రకంగా చైనా రష్యా లు జట్టు కట్టాయి . ఈ జట్టు పేరు ది కొరియన్ పీపుల్ 'స్ ఆర్మీ (KPA) . ఇది కూడా ఇప్పటికీ అలాగే వున్నది . నార్త్ కొరియాకు ఎవరు నాయకుడు గా ఉంటే వారు దీనికి లీడర్ అయి యుద్ధము కోన సాగిస్తారు .ఇదంతా తమ సృష్టి కాబట్టి - రష్యా చైనా నార్త్ కొరియా నాయకులకు మద్దత్తు ఇస్తూ

వుంటారు . సౌత్ కొరియా తమ సృష్టి కాబట్టి అమెరికా దానికి మద్దతు ఇస్తూ ఉంటుంది
.
సర్వసాధారణంగా - రష్యా వి చైనావి వేరు వేరు రకాల కమ్యూనిస్టు సిద్ధాంతాలు కదా? . వారి తలలు కలవవు కదా ? . మరి చైనా రష్యా ఈ కొరియా విషయంలో ఎందుకు కలిసాయి అంటే ? - సౌత్ కొరియాలో కూచున్న అమెరికా నార్త్ కొరియాని జయించుకొని తిన్నగా వచ్చి తన మీద పడుతుందేమో అనే భయం చైనాకు వున్నది- అదే కారణం .

అమెరికా రష్యాల మధ్య July 27, 1953 న "ది కొరియన్ ఆర్మీస్టిస్" అనే అగ్రిమెంట్ జరిగింది అని చెప్పుకున్నాము . " ఆర్మీస్టిస్" అగ్రిమెంట్ అంటే - ఇక నుండీ యుద్ధము మాని శాంతముగా ఉందాము " అని కాక . " మనము ఇరువురమూ యుద్ధము చేసీ చేసీ అలసి పోయాము - ఇప్పటికి ఈ యుద్ధము ఆపుకుందాము .తిరిగి మనం యుద్ధము ప్రారంభించే లోగా , మన దేశపు నాయకులు బల్లల ముందు కూచుండి - ఈ యుద్దానికి బదులు మరొక మార్గం ఏదన్నా ఉందని కనిపెడతారేమో చూద్దాము " అనే పరస్పర మిలిటరీ అవగాహన ఒప్పందం.

.పై అవగాహనా ఒప్పందం మూలకంగా రెండు కొరియాల మధ్య 150 మైల్స్ (240 km) పొడుగు మరియూ 2.5 మైల్స్ (4 km) -వెడల్పు కల బఫర్ జోన్ ను పెట్టారు . రెండు దేశాల సైన్యాలు ఈ బఫర్ జోనుకి రెండు కిలోమీటర్ల అవతలికి నుంచోవాలి . కాదని ముందుకు వస్తే యుద్ధము చేయటానికి అని వచ్చినట్లే అని రూల్ .ఒక క్యారెట్ను గబక్కన రెండు ముక్కల ల కింద ఖండిస్తే అవి ఒక దానికి ఒకటి కొంత దూరం జరుగుతాయి కదా ? ఇలా జరిగిన రెండుముక్కల మధ్య ఖాళీ జాగా వంటిదే ఈ బఫర్ జోను అని నా ఉదాహరణ.

పై ఖాళీ జాగా ఇటు సౌత్ కొరియా అండ్ అమెరికా కి కానీ అటు నార్త్ కొరియా అండ్ రష్యాకి గానీ చెందదు . ఇది వుమ్మడి ఆస్తి . ఈ ఖాళీ జాగాను ది "జాయింట్ సెక్యూరిటీ ఏరియా (JSA), అన్నారు . రెండు కొరియా దేశాల గురించి అమెరికా రష్యాలు చేసే చేర్చెలు అన్నీ ఈ (JSA) కూచుని చేయాలి అన్నారు. అందుకు తగ్గ బిల్డింగ్ లు కూడా ఇక్కడ వున్నాయి . ఈ చర్చెలు మూడు నెలలలోపు మొదలు కావాలి అని కూడా అన్నారు . ఈ (JSA) ఒక అప్పడం ఆకారంలో వున్నది అనుకుంటే - ఇందులో ఎవరి ముక్కఏదో అనేది - మిలిటరీ వారు గుర్తు పట్టటానికి వీలుగా - మిలిటరీ వారి కోసం అని - DMZ అనే గీతను గీసి దానిని

ముళ్లకంచెతోనూ , నేలలో పాతిన బాంబులతోనూ -ఎవరూ దాటకుండా కట్టు దిట్టం చేశారు . బఫర్ జోను లో జనసంచారం తగ్గినందున ఇక్కడ గ్రీన్ ఎన్విరాన్మెంట్ వృద్ధి అయి అనేక జంతువులకు ఆవాసంగా మారింది . ఇక ఈ JSA లోని DMZ అనే గీత కు ఇరు పక్కలా ఇరు దేశపు సైనిక అధికారులు ఒకరికొకరు అడుగుల దూరంలో నుంచుని వుంటారు . వీరు చిటిక వేస్తే వారికి వినపడుతుంది అన్నంత దెగ్గరలో నుంచుని - ఒకరి మీద ఒకరు చూపులతోనే కారాలు మిరియాలు విసురుకుంటూ వుంటారు . ఈ కారాలు మిరియాలు చూడటం కోసం ఈ JSA లోని DMZ అనే గీత వద్ద కు దేశ విదేశాల నుండి అనేక మంది యాత్రికులు వస్తారు . దీని వద్దకు పోవటానికి సౌత్ కొరియా మాత్రమే పెర్మిషన్ ఇస్తున్నందున - నేడు ఇది సౌత్ కొరియా లో ని పెద్ద టూరిస్ట్ స్పాట్ గా వుండింది .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

రెండు కొరియాల మధ్య 08 -02 -25 RKKR6

ఇంతకు మునుపు చెప్పిన (JSA) అనేది- DMZ అనే మిలిటరీ సరిహద్దు రేఖ వెంబడి వున్న ఒక ప్రాంతములో దరిదాపు వృత్తాకారం లో వున్న 800 మీటర్ ల భూభాగము . ఈ ఎనిమిది వందల మీటర్ల మధ్యలోనుండి మిలటరీ వారి సరిహద్దు గీతా పోతూ ఉంటుంది ఈ భాగములో నార్త్ కొరియా సైనికులు సౌత్ కొరియా సైనికులు ఒకరి కొకరు ఎదురుగా నుంచుంటారు . మనము టీవీ లలో కొరియా దేశము గురించి తరచూ చూచే ప్రాంతము ఇదే.
ఇక్కడ - నేను ఈ మధ్య టీవీలలో చూసిన రెండు నవ్వొచ్చే సంఘటనలు చెపుతాను . నార్త్ కొరియా వారు మనము చెత్తకుండీలలో వేసే చెత్త లాంటి దాన్ని పోగు చేసి దాన్ని నల్లని బట్టలలో నింపి దానికి బెలూన్లు కట్టి - ఆ బుట్ట గాలి వాటుకు సౌత్ కొరియాలోకి వెళ్లేట్లు వదిలారు .
బెలూన్లు పగిలి పోగానే బుట్టలో వున్నా చెత్త అంత సౌత్ కొరియాలో పడింది . ఇది ఓ రకమైన కవ్వింత . ఎందుకు చేశారు అన్నదానికి అల్ జజీరా- టీవీ ఇట్లా చెప్పింది ." సౌత్ కొరియా లో ఉంటూ నార్త్ కొరియాని సమర్ధించే కొరియన్లకు ఆనందం కలిగించటం కోసం ఈ చెత్త పని చేశారు" అని . దీనికి దీటుగా - సౌత్ కొరియా వారు అనేక వందల లౌడ్ స్పీకర్లు {డీజే బాక్స్ లు వంటివి } నార్త్ కొరియా వైపు తిప్పి మ్యూజిక్ పెట్టి నార్త్ కొరియా పై పగ తీర్చుకున్నారు . ఈ పనిని నార్త్ కొరియాలో ఉంటూ సౌత్ కొరియాని అభిమానించే వారిని ఆనందింపచేయటం కోసం చేశారు .ఇలావుంటాయి వీరి కవ్వింపు

చెర్యలు . కానీ దీని మీద ఏమనటానికి ఎవరికీ వీలు లేదు ఎందుకంటే" ఎవరూ గీత దాటలేదు . ఇలాంటి ది జరిగితే ఏమి చేయాలో అగ్రిమెంట్ లో లేదు . అందుకని

ఇక ఈ జాయింట్ సెక్యూరిటీ ఏరియా లోకి విదేశీ మరియూ స్వదేశీ విజిటర్స్ ను అనుమతిస్తారు కానీ ఒంటరిగా వచ్చే వ్యక్తులను మాత్రము రానివ్వరు . గ్రూప్ లుగా వచ్చేవారిని మాత్రమే రానిస్తారు .ఎందుకంటే ఒంటరిగా వచ్చిన వ్యక్తి ఇటు సౌత్ కొరియాలోకి గానీ అటు నార్త్ కొరియాలోకి గానీ వెళ్ళిపోతే - అతను ఎవరో తెలుసుకోవటం కష్టం అవుతుంది . కానీ గ్రూప్ లో నుండి ఒకరు తప్పించుకొని వెళ్ళిపోతే - గ్రూప్ మెంబర్లందరినీ జైల్లో పారేసి - వారినుండి తప్పించుకు పోయిన వాడి వివరాలు కనిపెట్ట వచ్చు అని .
కొరియా ఒప్పందం కుదిరినాక - సౌత్ కొరియాలో ఉన్న జపాన్ సైనికులు బయటికి వెళ్ళటానికి వీలుగా " బ్రిడ్జి అఫ్ నో రిటర్న్ " అనే చెక్క బ్రిడ్జి ని వాడారు . ఆరోజుల్లో ఈ బ్రిడ్జిని దాటే వాళ్లకు " నువ్వు వెడితే మల్ల వెనక్కి రాలేవు " అనే హెచ్చరిక చేసి పంపేవారు . అందువలన దీనికి ఆ పేరు వచ్చింది .ఈ బ్రిడ్జీ ని కేవలం బయటికి పోవటానికి మాత్రమే వీలుగా ఉండేట్లు కడితే సరిపోతుంది కాబట్టి - దీనిని 72 గంటలలో కట్టారు . అందు వలన దీనిని డెబ్బై రొండు గంటల బ్రిడ్జి అనికూడా అంటారు . దీని మీదగా రష్యా - అమెరికా మిలటరీ అధికారులు మాత్రమే jsa లోకి రాగలుగుతారు .ఈ బ్రిడ్జి అఫ్ నో రిటర్న్ దాటిన వారు అమెరికా లోకి వలస పోయే సౌలభ్యం ఇచ్చారు . ఇట్లా చాలామంది జపానీయాలు అమెరికా చేరుకున్నారు. అమెరికా ఇలాంటి వలస విధానాన్ని ప్రోత్సహించటం వల్ల ప్రతి దేశములోనూ అమెరికాను ప్రేమించే కుటుంబాల సంఖ్యా లేదా అమెరికా మద్దతు దారుల సంఖ్యా పెరుగుతూ ఉంటుంది .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి
దీనికి ముందు భాగాన్ని ఇదే ఫేస్బుక్కు లో rkkr5 అని - సెర్చ్ చేయటం ద్వారా మీరు చదవవచ్చు .దీని తరువాత భాగము లేదు . కానీ దీనికి సంభందించిన ఒక ఆసక్తి కరమైన యదార్ధ సంఘటనను "చెట్టు చుట్టూ కధ 03-01-25 " వ్రాసాను . దానిని 03-01-25 అనే తేదీతో సెర్చ్ చేయటం ద్వారా తిరిగి చదవవచ్చు .



DAUGHTER OF **Kim Jong Un– Ri Sol-జూ 14 YEARS**

.



Jsa area




ఇక  (JSA) అనేది- మిలిటరీ సరిహద్దు రేఖ వెంబడి వున్నా ఒక ప్రాంతములో దరిదాపు వృత్తాకారం లో వుండే  800 మీటర్ ల భూభాగము . ఈ ఎనిమిది వందల మీటర్ల  మధ్యలోనుండి మిలటరీ వారి సరిహద్దు గీతా పోతూ ఉంటుంది  ఈ భాగములో నార్త్ కొరియా సైనికులు సౌత్ కొరియా సైనికులు ఒకరి కొకరు ఎదురుగా నుంచుంటారు .  మనము టీవీ లలో కొరియా దేశము గురించి చూచే ప్రాంతము ఇదే

ఇక్కడ - నేను ఈ మధ్య టీవీలలో చూసిన రెండు నవ్వొచ్చే సంఘటనలు చెపుతాను .

నార్త్ కొరియా వారు మనము చెత్తకుండీలలో వేసే చెత్త లాంటి దాన్ని పోగు చేసి దాన్ని నల్లని బట్టలలో నింపి దానికి బెలూన్లు కట్టి - ఆ బుట్ట గాలి వాటుకు సౌత్ కొరియాలోకి వెళ్లేట్లు చేశారు .

బెలూన్లు పగిలి పోగానే బుట్టలో వున్నా చెత్త అంత సౌత్ కొరియాలో పడింది . ఇది ఓ రకమైన కవ్వింత . ఎందుకు చేశారు అన్నదానికి అల్ జజీరా- టీవీ ఇట్లా

చెప్పింది . సౌత్ కొరియా లో ఉంటూ నార్త్ కొరియాని సమర్ధించే కొరియన్లకు ఆనందం కలిగించటం కోసం ఈ చెత్త పని చేశారు. దీనికి దీటుగా - సౌత్ కొరియా వారు అనేక వందల లౌడ్ స్పీకర్లు {డీజే బాక్సలు వంటివి } నార్త్ కొరియా వైపు తిప్పి మ్యూజిక్ పెట్టి నార్త్ కొరియా పై పాగా తీర్చుకున్నారు . ఈ పనిని నార్త్ కొరియాలో ఉంటూ సౌత్ కొరియాని అభిమానించే వారిని ఆనందింపచేయటం కోసం చేశారు ఇవి కవ్వింపు చెర్యలు . కానీ దీని మీద ఏమనటానికి ఎవరికీ వీలు లేదు ఎందుకంటే" ఎవరూ గీత దాటలేదు . ఇలాంటి ది జరిగితే ఏమి చేయాలో అగ్రిమెంట్ లో లేదు . అందుకని

ఇక జాయింట్ సెక్యూరిటీ ఏరియా లోకి విజిటర్స్ ను అనుమతిస్తారు కానీ గ్రూప్ లుగా మాటమే రాణిస్తారు
కొరియా ఒప్పందం కుదిరినాక - సౌత్ కొరియాలో ఉన్న సైనికులు బయటికి వెళ్ళటానికి వీలుగా బ్రిడ్జి అఫ్ నో రిటర్న్ అనేచెక్క బ్రిడ్జి ని వాడారు . ఆరోజుల్లో ఈ బ్రిడ్జిని దాటే వాళ్లకు " నువ్వు వెడితే మల్ల వెనక్కి రాలేవు " అనే హెచ్చరిక చేసి పంపేవారు . అందువలన దీనికి ఆ పేరు వచ్చింది .
పైబ్రిడ్జీ మీద కేవలం పోవటమే వీలున్నందున - jsa లోకి వచ్చి పోవటానికి వీలుగా ఓ బ్రిడ్జి ని 72 గంటలలో కట్టారు . దీనిని డెబ్బై రొండు గంటల బ్రిడ్జి అంటారు . దీని మీదగా రష్యా - అమెరికా మిలటరీ అధికారులు jsa లోకి వచ్చి పోతూ వుంటారు





చెట్టు చుట్టూ కథ     03-01-25

సౌత్ కొరియా అమెరికా వారి చేతుల్లో వుంది . ఇక్కడ అమెరికా సైన్యము  ఉంటుంది . నార్త్ కొరియా రష్యా వారి చేతుల్లో ఉంటుంది  .ఇక్కడ రష్యా వారి సైన్యము ఉండదు . రష్యావారు నార్త్ కొరియా కి  మద్దత్  గా నిలుస్తారు అంతే  .  అంటే రష్యా మరియూ  అమెరికా సైన్యము ఒకరికి ఒకరు ఎదురు పడటం అనేది ఉండదు.  ఇక ఈ కొరియా గురించి ఏదన్నా చేర్చించు  కోవాల్సి వస్తే అందుకు అనుగుణంగా ఉండేట్లు   - రష్యా మరియూ అమెరికా దేశాలు కొరియా మధ్యలో 800 మీటర్ల వృత్తకారపు ఏరియాని ఏర్పరుచుకున్నాయి . దీనిని జాయింట్ సెక్యూరిటీ ఏరియా {JSA } అంటారు . ఈ ఏరియాలో ఉన్న  బిల్డింగ్ లలో సౌత్ కొరియా మిలిటరీ వారు  నార్త్ కొరియా మిలిటరీ వారు ఒకరి కొకరు తుపాకులు ఎక్కు పెట్టుకొని ఒకరికొకరు కొన్ని అడుగుల దూరంలో నిలబడి వుంటారు . ఈ {JSA }.ఉమ్మడి జాగాలో  లో ఎవరి హద్దు ఎక్కడి వరుకు అనేది నిర్ణయం అయి లేదు . ఇలాంటి ఉమ్మడి జాగాలో రావి చెట్టు వంటిది మొలిచి పెరిగింది .ఈ చెట్టు ఏ రోజు కా రోజు ఏపుగా పెరిగే స్వభావం వున్న చెట్టు .  సౌత్ కొరియాకు చెందిన నెలలో పుట్టి పెరుగుతున్నదా?  లేక లేక నార్త్ కొరియాకి చెందిన నేలలో పుట్టి పెరుగుతున్నదా ? అనేది నిర్ణయించటానికి వీలు లేని చోట ఈ చెట్టు పుట్టి పెరుగుతూ వున్నది.

నేల ఎవరిదీ అని నిర్ణయించటానికి వీలులేని ప్రాంతాన్ని standoff పాయింట్ అని - అక్కడి చెట్టును "స్టాండాఫ్ ట్రీ " అని అంటారు .   ఆగష్టు  1976  నిజంగా ఇలా  జరిగింది . సౌత్ కొరియా లో ఉంటూ నిరంతరమూ నార్త్ కొరియా లోకి తొంగి చూసే సైనిక దళము ఒకటి - తమ బైనార్క్యులర్స్ యొక్క దృష్టికి ఈ  రావి చెట్టు అడ్డుగా వస్తూ వున్నదని ఫిర్యాదు చేసింది  .  దీనికి స్పందించిన అమెరికా - - "ఆపరేషన్ లంబార్జాక్ " అనే పేరుఈ చెట్టు నరికే పని చేపట్టింది  . August 18, 1976  న - రెండున్నర టన్నుల   బరువు వుండే ఓ భారీ లారీ మీదకు ఎక్కిన అమెరికా వారు చెట్టును నరకటానికి వచ్చారు  .లారీలో ఓ ఐదు  మంది పనివారూ - వారికి

రక్షణగా ఫది మంది సైనికులు -వచ్చారు . ఈ రక్షణ దళానికి నాయకులు " Lieutenant Mark Barrett మరియూ "Captain Arthur Bonifas "
చెట్టును నరుకుతూ ఉండగా నార్త్ కొరియా సైనికులు మొదట మౌనంగా చూస్తూ ఊరుకున్నారు .

కానీ అమెరికా సైనికుల యొక్క హంగామా చూసి ఇదేదో కవ్వింపు చర్య అని భావించిన ఓ నార్త్ కొరియా అధికారి తనకోసం మరికొంత సైన్యాన్ని రప్పించుకున్నాడు .అప్పుడు మొత్తము 15 మంది వరకూ కల నార్త్ కొరియన్ సోల్జర్స్ చెట్టు వద్దకు వచ్చారు ."వారి మీద దాడి చేసి ఆ చెట్టు నరికివేతను ఆదుకోండి "అని ఆ అధికారి ఆదేశించాడు . దాడిని ఆదేశించిన వాని పేరు "పక్ చుల్ " ("Lt.Pak Chul ఇతనికి ""Lt Bulldog",అనే మారు పేరుకూడా వుంది . అంటే చిన్న అలజడికి కూడా రెచ్చిపోయే స్వభావం వున్నవాడు . నార్త్ కొరియా సైనికులు - చెట్టును నరుకుతూ వున్న వారిని అటకాయించి వారి చేతుల్లో వున్న గొడ్డళ్లు స్వాధీనం చేసుకున్నారు . ఆపై అమెరికా వారి మీద పడి అవేగొడ్డళ్ళతో . ఇద్దరు అమెరికా సైనికాధికారులను చంపి వేసి - నలుగురు అమెరికా సైనికులను నలుగురు సౌత్ కొరియా సైనికులను గాయపరిచారు . జరిగిన దానికి నార్త్ కొరియా సౌత్ కొరియాకి క్షమాపణ చెప్పింది.
చెట్టు కు అత్యంత తొందరగా పెరిగే స్వభావము ఉన్నది . మళ్ళా పెరుగుతుంది- మళ్ళా ఓ తగాదా వస్తుంది అనే ఆలోచనతో -- August 21, 1976 న అమెరికా మరొకసారి ఈ చెట్టు జోలికి పోయింది . చెట్టును మొదలంటా నరికి వేయటంద్వారా సమస్యకు ఓ పరిష్కారం కనుగొనాలనే కాక , నార్త్ కొరియాకి తమ శక్తీ చూపించాలని కూడా అమెరికా అనుకుంది . ఈ సారి ఈ చెట్టు నరికి వేతకు రొండు రోజులముందునుండీ ప్లాన్ చేశారు . US Army తరఫునజనరల్ రిచర్డ్ G. స్టెల్వెల్ అనే అయన పధకాన్ని రూపొందించగా , కెప్టెన్ ఆర్థర్ బోనిఫేస్ అనే అయన ఈ పధకాన్ని అమలు జరుపుతాడు . చెట్టు నరుకుతున్న పుడు నార్త్ కొరియా సైనికులు కనుక మళ్ళా జోక్యం చేసుకుంటే వారి పని పట్టటానికి వీలుగా 27 హెలికాప్టర్స్ --బాంబర్లు -మిలిటరీ గ్రౌండ్ వెహికల్స్ -ఆఫ్ -షోర్ ఎయిర్క్రాఫ్ట్ కారియర్ -- 64 మంది సౌత్ కొరియన్ సైనికులు విత్ గన్స్ మరియూ మరో 60 మంది విత్ పిస్టల్స్ -తో సిద్ధంగా ఉండేట్లు చూసుకున్నారు .

ఎనిమిదిది మంది మనుషులు చైన్ సా ని పట్టుకొని వెళ్లి చెట్టు పని పట్టారు . "నీదో నాదో తేలని చెట్టును తుదముట్టించ గలిగిన దమ్ము నాకే వున్నది - నీకు లేదు " అని రష్యాతో చెప్పటానికే అమెరికా ఈ చెట్టు నరుకుడుకి నడుం కట్టింది అని విశ్లేషించబడింది . మొత్తము మీదా 300 సైనిక ట్రూపులు వెన్ను దన్నుగా నిలవగా అమెరికా ఈ చెట్టును 40 నిమిషాలలో పడకొట్టింది . ఈ సారి నార్త్ కోరీయా ఏమి మాట్లాడక మౌనం వహించింది . అమెరికా వారు చెట్టును పడగొట్టి ఆ మొద్దును స్వాధీన పరుచుకొని - తీసుకు వెళ్లి - ఇంతకు ముందు ఈ చెట్టు వద్ద ప్రాణాలు కోల్పోయిన ఇద్దరు అమెరికన్ మిలటరీ అధికారుల సమాధి వద్ద పడవేశారు . అమెరికన్ సైనికుల మీదకు నార్త్ కొరియా సైనికుల దాడిని ఆదేశించిన "పక్ చుల్ ఆ తరువాత రోజుల్లో ఇదే సరిహద్దులవద్ద ఇరుదేశాల మధ్య జరిగిన కాల్పులలో మరణించాడు అని చెప్పారు . ఆలా అని రికార్డులు మాత్రం లేవు . కానీ అటుతరువాత ఇతనూ ఎవరికీ కనపడకుండా పోయాడు . "పక్

చుల్ " బ్రతికే ఉంటే కనుక అతనిని వెతికి వేటాడి పట్టుకోవాల్సిన పని అమెరికా సి ఐ ఏ కి తగిలి ఉండేది .

. ఏది ఏమైనా చెట్టు కేంద్రంగా మరో ప్రపంచ యుద్ధము జారకుండా ఆగిపోయిందని ప్రపంచములోని అందరూ ఊపిరి పీల్చుకున్నారు .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి








The murder inchident




THE GRAND SON OF THE WRITER - SAMBHU UMA NIKHIL NANANDAN WITH HIS MONTER SUCHITRA - PETERNAL GRAND MOTHER VARANASI UMA DEVI

